నమస్తేస్తు మహామామే శ్రీ పీఠే సుర పూజితే

శంఖచక్ర గదా హస్తే మహాలక్ష్మి నమోస్తుతే!



# శ్రీ వరలక్ష్మీ దేవి వ్రత పూజ విధానం

Not for sale : పూర్తి ఉచితము

# వరలక్ష్మీ దేవి వ్రత పూజ విధానం

## వ్రతమునకు కావలసిన పూజ సామాగ్రి:-

- పసుపు
- కుంకుమ
- గంధం
- విడిపూలు
- పూల మాలలు
- తమలపాకులు 30
- వక్కలు
- ఖర్జూరాలు
- అగరవత్తులు
- కర్పూరం
- చిల్లర పైసలు
- తెల్లని వస్త్రం
- రవికల గుడ్డ
- మామిడి ఆకులు
- ఐదు రకాల పండ్లు
- అమ్మవారి ఫోటో
- కలశం
- కొబ్బరి కాయలు
- తెల్ల దారం లేదా నోము దారం, లేదా పసుపు రాసిన కంకణం,
- ఇంటిలో తయారుచేసిన నైవేధ్యాలు
- బియ్యం

- పంచామృతాలు
- దీపపు కుందులు
- ఒత్తులు
- నెయ్యి

## వ్రత విధానం

శ్రావణమాసంలో పౌర్ణమి ముందు వచ్చే శుక్రవారం రోజున వరలక్ష్మీ దేవి వ్రతాన్నిఆచరించాలి. ఆ రోజున వీలుకాకపోతే తరువాత వచ్చే శుక్రవారాలలో కూడా ఈవ్రతాన్ని చేసుకోవచ్చు. వరలక్ష్మీ దేవి వ్రతానికి ఆదిదేవతయైన లక్ష్మీదేవి ఒకనాటి రాత్రి సమయంలో చారుమతికి కలలో సాక్షాత్కరించింది. సువాసినులందరూ చేసే ప్రాభవ వ్రతం. 'శ్రీ వరలక్ష్మీ నమస్తు వసుప్రదే, సుప్రదే' శుక్రవారం రోజున జరుపుకునే వరలక్ష్మీ వ్రతంతో ధన, కనక, వస్తు,వాహనాది సమృద్ధులకు మూలం. శ్రావణ శుక్రవార వ్రతాలతో పాపాలు తొలిగి లక్ష్మీ ప్రసన్నత కలుగుతుంది.

వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించే రోజున ఉదయాన్నే లేచి తలస్నానం చేసి, ఇంటిని శుభ్రం చేసుకోవాలి. ఇంట్లోని పూజా మందిరంలో ఒక మండపాన్ని ఏర్పాటుచేసుకోవాలి. ఈ మండపం పైన బియ్యపు పిండితో ముగ్గువేసి, కలశం ఏర్పాటుచేసుకోవాలి. అమ్మవారి ఫొటో లేదా రూపును తయారుచేసి అమర్చు కోవాలి. పూజాసామగ్రి, తోరాలు, అక్షతలు, పసుపు గణపతిని ముందుగానే సిద్ధం చేసుకుని ఉంచాలి.

**తోరం తయారు చేసుకోవడం:**

తెల్లటి దారాన్ని ఐదు లేక తొమ్మిది పోగులు తీసుకుని దానికి పసుపు రాయాలి. ఆ దారానికి ఐదు లేక తొమ్మిది పూలు కట్టి ముడులు వేయాలి. అంటే ఐదు లేక తొమ్మిది పోగుల దారాన్ని ఉపయోగించి, ఐదు లేక తొమ్మిదో పువ్వులతో ఐదులేక తొమ్మిది ముడులతో తోరాలను తయారుచేసుకుని, పీఠం వద్ద ఉంచి పుష్పాలు, పసుపు, కుంకుమ, అక్షతలు వేసి, తోరాలను పూజించి ఉంచుకోవాలి. ఆవిధంగా తోరాలను తయారుచేసుకున్న తరువాత పూజకు సిద్ధంకావాలి.

# వ్రత ఆరంభం

ముందుగా వ్రతం ఎలాంటి విఘ్నం కలగకుండా పూర్తి చేయాలని కోరుకుంటూ సర్వ విఘ్నాలను హరింప చేసే విఘ్నేశ్వరుని ప్రార్థన , పూజ తో వ్రతాన్ని ప్రారంభించాలి. ముందుగా పసుపుతో తయారు చేసిన గణపతిని పూజించాలి.

**గణపతి ప్రార్థన:-**

పసుపుతో చేసిన గణపతికి కుంకుమ పెట్టి తమలపాకులో ఉంచవలెను. చిన్నపల్లెములో బియ్యం పోసి ఆ బియ్యం మీద పసుపుతో చేసిన గణపతి తమలపాకుతో పాటు ఉంచవలెను.స్వామి వారు తూర్పు దిశ చూస్తున్నట్లు ఉండవలెను. కొబ్బరి నూనే లేదా ఆవునేతితో దీపము వెలిగించి, గణపతికి నమస్కరించి ఈ విధముగా చదువ వలెను.

శ్రీ మహాగణాధిపతియే నమః : శ్రీ గురుభ్యోనమః : హరి : ఓం

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే!!

అగజానన పద్మార్కం గజాననమహర్నిశం

అనేక దం తం భక్తానాం ఏకదంతముపాస్మహే!!

శ్రీ వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ

నిర్విఘ్నం కురు మే దేవ సర్వ (శుభ) కార్యేషు సర్వదా!!

అయ ముహూర్త స్సుముహూర్తో అస్తు.

**ఆచమనం :-**

పాత్ర (అనగా చిన్న చెంబు లేక గ్లాసు) నీటితో లేదా స్పర్శతో ఆచమనం చేయవలెను. బొటనవ్రేలి చివరను మధ్యవ్రేలి మధ్యకణపునకు చేర్చి అరచేతిలో మినపగింజ మునిగేటత నీటిని పోసుకుని ఆచమనం చేయవలెను.

ఓం కేశవాయ స్వాహా :

ఓం నారాయణాయ స్వాహా :

ఓం మాధవాయ స్వాహా :

( ఈ మూడు నామములను చెప్పుకుంటూ కుడి చేతిలో నీరు వేసుకొని శబ్ధం రాకుండా త్రాగవలెను )

ఓం గోవిందయ నమః : ( చేయ్యి కడుగ వలెను .)

ఓం ఓం త్రివిక్రమాయ నమ : ఓం వామనాయ నమ : ఓం శ్రీధరాయ నమ : ఓం హృశీకేశవాయ నమ : ఓం పద్మనాభాయ నమ : ఓం దామోదరాయ నమా : ఓం సంకర్షణాయ నమా : ఓం వాసుదేవయ నమ : ఓం ప్రాయోమమయ నమా : ఓం పురుషోత్తమయ నమా : ఓం అధోక్షోజయ నమ : ఓం అచ్యుతాయ నమా : ఓం జనతనాయ నమ : ఓం హరయే నమ : ఓం శ్రీ కృష్ణాయ నమ :

**దైవ ప్రార్ధన :-**

(గణపతికి నమస్కరించి ఈ క్రింది శ్లోకములు చదువ వలెను.

శ్లో :- ఓం యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళం |

తయోస్సంస్మరణాత్ పూర్వం సర్వతో జయ మంగళం

శ్లో :- లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవ:

యేషామిందీవరహశ్యామో హృదయ స్థోజనార్ధన :

శ్లో :- సర్వమంగళ మాగళ్యే శివే సర్వార్థసాధకే |

శరణ్యే త్ర్యంబకేదేవి నారాయణి నమో஽స్తుతే .

శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమ :

ఉమా మహేశ్వరరాభ్యాం నమ :

శచీ పురంధరాయణ నమ :

అరుంధతి వశిష్టాభ్యాం నమ :

శ్రీ సీతారామభ్యాం నమ:

సర్వేభ్యో మహాజనేభ్యో నమ: ||

( క్రింది విధముగా చదువుతూ అక్షితలను వెనుక వేసుకొనవలెను )

శ్లో :- ఉత్తిష్టంతు భూతపిశాచా: ఏతే భూమి భారకా:

ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే

**ప్రాణానాయమ్య ( ముక్కు పట్టుకుని )**

ఓం భూ : ఓం భువ : ఓం సువ : ఓం మహ : ఓం జన : ఓం తప : ఓగ్ం సత్యమ్ ఓం తత్సవితుర్వేణ్యం భర్గోదేవస్య ధీమహి| ధియోయోన ప్రచోదయాత్ ఓమ్ ఆపోజ్యోతిరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్||

(గృహస్థులు ఐదు వ్రేళ్ళతోను ముక్కును పట్టుకుని ఎడమ చెయ్యి ద్వారా గాలిని పీల్చి, ఓం భూ: నుండి భుర్భువస్సువరోం వరకు మంత్రం చదివేంత వరకు గాలిని బంధించి తరువాత మెల్లగా గాలిని కుడి వైపున ముక్కు రంధ్రం ద్వారా వదలాలి.

( దీనిని బొటన వ్రేలు, చిటికెన వ్రేళ్ళ సహాయంతో చేయవలెను.)

## సంకల్పము :

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే , శ్రీ మహా విష్ణోరాజ్ఞాయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రధమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీ శైలస్య అస్మిన్ వర్తమాన వ్యావహారిక, చాంద్రమానేన శ్రీ ............... .నామా సంవత్సరము, దక్షిణాయేనే, వర్షరుతుడు, భద్రపదమాసే, శుక్లప క్షేత్రం, చతుర్థ్యం .................. వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిధౌ శ్రీమాన్ ............ గోత్రః ......... .నామధేయః ధర్మపత్నీ సమేతోహం సకుటుంబస్య క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం , ధర్మార్ధ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం సకలకార్యేషు సర్వదా దిగ్విజయసిద్ధ్యర్థం, శ్రీ వరసిద్ధి వినాయక దేవత దేవతాపూజాం కరిష్యే అదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే ( అని సంకల్పం చేసి )

( కలశంలోని నీరు ముట్టుకొనవలెను )

శ్లో : కలశస్యముఖే విష్ణుః కంఠేరుద్ర స్సమాశ్రితః

మూలే తత్రోస్థితోబ్రహ్మ మధ్యేమాతృగణా స్మృతాః

కుక్షౌ తు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుందరా

ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదోహ్యథర్వణః

అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః

(కలశములోని జలమును పుష్పముతో దేవునిపైనా పూజాద్రవ్యములపైన,తమపైన జల్లుకొనవలెను.తదుపరి పసుపు వినాయకునిపై జలము జల్లుచు ఈ క్రింది మంత్రము చదువవలెను.)

శ్లో : గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి

నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు

ఆయాంతు దేవపూజార్థం – మమ దురితక్షయకారకాః

కలశోదకేన పూజాద్రవ్యాణి దైవమాత్మానంచ సంప్రోక్ష్య

(పుష్పముతో పసుపు గణపతి తాకుతూ ఈ క్రింది విధముగా చదువ వలెను.

అసునీ తేపునరస్మాసు చక్షు : పునః : ప్రాణ మినహనో దేహి భోగమ్|

జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమంతే మృడయాన స్వస్తి

ఓం అమృతం వై ప్రాణా: అమృతమాప: ప్రాణానేవ యధాస్థానముపహ్వాయతే||

స్థిరోభవ,వరదోభవ,సుముఖోభవ,సుప్రసన్నోభవ,స్థిరాసనం కురు|| .

ఓం గణానాంత్వా గణపతిగ్ంహావామహే కవిం కవీనాం ముమమశ్రవస్తవం|

జ్యేష్టరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశృణ్యన్నూతిభిస్సీద సాదనమ్.

**షోడశోపచార పూజ :**

(క్రింది విధంగా చెబుతూ ఒక్కొక్కటికి గణపతికి అక్షితలను సమర్పించవలెను.)

శ్రీ మహాగణాధిపతియే నమః

ధ్యాయామి ధ్యానం సమర్పయామి

ఆవాహయామి ఆవాహనం సమర్పయామి

నవరత్న ఖచిత స్వర్ణ సింహాసనం సమర్పయామి.

(అగరొత్తులు వెలిగించి దూపము చూపించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమ: ధూపమాఘ్రాపయామి.

(దీపానికి నమస్కరించవలెను.)

దీపం దర్శయామి. ధూపదీపనంతరం శుద్ధాచమనీయం సమర్పామి.

నైవేద్యం సమర్పామి.

నైవేద్యం:-

బెల్లము వండిన ప్రసాదం మీద నీరు చల్లి చుట్టూ నీరు వేసి క్రింది విధముగా చదివి నివేదనము చేయవలెను.

ఓం భూర్భువస్సువ:ఓం తత్సవితుర్వేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోన: ప్రచోదయాత్.

నీళ్ళు పుష్పంతో చల్లి

ఓం సత్యం త్వర్తేన పరిషించామి.

పుష్పము నీటిలో ముంచి నైవేద్య పదార్ధమ్ చుట్టు తిప్పాలి.

ఓం అమృతమస్తు | ఓమ్ అమృతోపస్తణమసి

ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం

ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా (క్రిందివిధంగా చదివి కలశములోని నీటి వదలవలెను.) మధ్య మధ్య పానీయం సమర్పణమి.

శ్రీ మహాగణాధిపతియే నమః: తాంబులం సమర్పణమి.

(కర్పూరం వెలిగించి గంట మ్రోగించాలి)

శ్రీ మహాగణాధిపతియే నమః: ఆనందకర్పూర నీరాజనం సమర్పణమి

పూజ చేసిన అక్షితలను, పుష్పములు శిరస్సున ధరించవలెను.

శ్లో : యస్యస్మృతాచ నామూక్త్యా తప: క్రిమాదిషు|

న్యూనం సంపూర్ణతాం యాంతి సద్యో వందే గణాధిప |

మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం గణాధిప |

యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే.

అనయా ధ్యాన అవాహనాది షోడశోపచార పూజయా భగవన్ సర్వాత్మక: శ్రీ మహాగణాధిపతి: వరదోభవతు

అని ఉదకం అక్షితలను చేతిలో వేసుకుని గణపతి కాళ్ళ దగ్గర వదిలి వేయాలి.మనస్ఫూర్తిగా స్వామికి నమస్కారం చేసుకోవాలి.

ఉద్వాసన :

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవా: తాని ధర్మాణి ప్రధమాన్యాసన్ తేహనాకం మహిమానస్యచం తే యత్ర పూర్వే సాధ్యాస్సతి దేవా: శ్రీ మహాగణపతిం యధాస్థానం ప్రవేశయామి శోభనార్ధే పునరాగమనాయచ||

# అధాంగపూజ:-

పువ్వులు లేదా అక్షతలతో కలశానికి పూజ చేయాలి.

చంచలాయై నమః – పాదౌ పూజయామి,

చపలాయై నమః – జానునీ పూజయామి,

పీతాంబరాయైనమః – ఉరుం పూజయామి,

మలవాసిన్యైనమః – కటిం పూజయామి,

పద్మాలయాయైనమః -నాభిం పూజయామి,

మదనమాత్రేనమః – స్తనౌ పూజయామి,

కంబుకంఠ్యై నమః- కంఠంపూజయామి,

సుముఖాయైనమః – ముఖంపూజయామి,

సునేత్రాయైనమః – నేత్రౌపూజయామి,

రమాయైనమః – కర్ణౌ పూజయామి,

కమలాయైనమః – శిరః పూజయామి,

శ్రీవరలక్ష్మైనమః – సర్వాణ్యంగాని పూజయామి.

(ఆ తరువాత పుష్పాలతో అమ్మవారిని అష్టోత్తర శతనామాలతో పూజించాలి)

## శ్రీ వరలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ఓం ప్రకృత్యై నమః

ఓం వికృత్తై నమః

ఓం విద్యాయై నమః

ఓం సర్వభూత హితప్రదాయై నమః

ఓం శ్రద్ధాయై నమః

ఓం విభూత్యై నమః

ఓం సురభ్యై నమః

ఓం పరమాత్మికాయై నమః

ఓం వాచ్యై నమః

ఓం పద్మాలయాయై నమః

ఓం పద్మాయై నమః

ఓం శుచయే నమః

ఓంస్వాహాయై నమః

ఓం స్వధాయై నమః

ఓం సుధాయై నమః

ఓం ధన్యాయై నమః

ఓంహిరణ్మయై నమః

ఓం లక్ష్మ్యై నమః

ఓం నిత్యపుష్టాయై నమః

ఓం విభావర్యైనమః

ఓం ఆదిత్యై నమః

ఓం దిత్యై నమః

ఓం దీప్తాయై నమః

ఓం రమాయై నమః

ఓం వసుధాయై నమః

ఓం వసుధారిణ్యై నమః

ఓం కమలాయై నమః

ఓం కాంతాయై నమః

ఓంకామాక్ష్యై నమః

ఓం క్రోధ సంభవాయై నమః

ఓం అనుగ్రహ ప్రదాయై నమః

ఓం బుద్ధ్యై నమః

ఓం అనఘాయై నమః

ఓం హరివల్లభాయై నమః

ఓం అశోకాయై నమః

ఓంఅమృతాయై నమః

ఓం దీపాయై నమః

ఓం తుష్టయే నమః

ఓం విష్ణుపత్న్యై నమః

ఓం లోకశోకవినాశిన్యై నమః

ఓం ధర్మనిలయాయై నమః

ఓం కరుణాయై నమః

ఓం లోకమాత్రే నమః

ఓం పద్మప్రియాయై నమః

ఓం పద్మహస్తాయై నమః

ఓంపద్మాక్ష్యై నమః

ఓం పద్మసుందర్యై నమః

ఓం పద్మోద్భవాయై నమః

ఓంపద్మముఖీయై నమః

ఓం పద్మనాభప్రియాయై నమః

ఓం రమాయై నమః

ఓం పద్మమాలాధరాయై నమః

ఓం దేవ్యై నమః

ఓం పద్మిన్యై నమః

ఓం పద్మ గంధిన్యైనమః

ఓం పుణ్యగంధాయై నమః

ఓం సుప్రసన్నాయై నమః

ఓం ప్రసాదాభిముఖీయైనమః

ఓం ప్రభాయై నమః

ఓం చంద్రవదనాయై నమః

ఓం చంద్రాయై నమః

ఓం చంద్రసహోదర్యై నమః

ఓం చతుర్భుజాయై నమః

ఓం చంద్ర రూపాయై నమః

ఓం ఇందిరాయై నమః

ఓం ఇందుశీతలాయై నమః

ఓం ఆహ్లోదజనన్యై నమః

ఓం పుష్ట్యైనమః

ఓం శివాయై నమః

ఓం శివకర్యై నమః

ఓం సత్యై నమః

ఓం విమలాయై నమః

ఓం విశ్వజనన్యై నమః

ఓం దారిద్ర నాశిన్యై నమః

ఓం ప్రీతా పుష్కరిణ్యైనమః

ఓం శాంత్యై నమః

ఓం శుక్లమాలాంబరాయై నమః

ఓం శ్రీయై నమః

ఓం భాస్కర్యై నమః

ఓం బిల్వ నిలయాయై నమః

ఓం వరారోహాయై నమః

ఓం యశస్విన్యైనమః

ఓం వసుంధరాయై నమః

ఓం ఉదారాంగాయై నమః

ఓం హరిణ్యై నమః

ఓంహేమమాలిన్యై నమః

ఓం ధనధాన్యకర్యై నమః

ఓం సిద్ధ్యై నమః

ఓం త్రైణసౌమ్యాయై నమః

ఓం శుభప్రదాయై నమః

ఓం నృపవేశగతానందాయై నమః

ఓం వరలక్ష్మ్యై నమః

ఓం వసుప్రదాయై నమః

ఓం శుభాయై నమః

ఓంహిరణ్యప్రాకారాయై నమః

ఓం సముద్రతనయాయై నమః

ఓం జయాయై నమః

ఓం మంగళాదేవ్యై నమః

ఓం విష్ణువక్షస్థల స్థితాయై నమః

ఓం ప్రసన్నాక్ష్యైనమః

ఓం నారాయణసీమాశ్రితాయై నమః

ఓం దారిద్ర ధ్వంసిన్యై నమః

ఓం సర్వోపద్రవ వారిణ్యై నమః

ఓం నవదుర్గాయై నమః

ఓం మహాకాళ్యై నమః

ఓం బ్రహ్మావిష్ణుశివాత్మికాయై నమః

ఓం త్రికాలజ్ఞానసంపన్నాయై నమః

ఓం భువనేశ్వర్యై నమః

## కంకణపూజ

కంకణాన్ని అమ్మవారి వద్ద పెట్టి అక్షతలతో ఈ క్రింది విధంగా పూజ చేయాలి.

కమలాయైనమః – ప్రథమగ్రంథిం పూజయామి,

రమాయైనమః – ద్వితీయ గ్రంథింపూజయామి,

లోకమాత్రేనమః – తృతీయ గ్రంథింపూజయామి,

విశ్వజనన్యైనమః – చతుర్థగ్రంథింపూజయామి,

మహాలక్ష్మ్యై నమః – పంచమగ్రంథిం పూజయామి,

క్షీరాబ్ధి తనయాయై నమః – షష్ఠమ గ్రంథిం పూజయామి,

విశ్వసాక్షిణ్యై నమః – సప్తమగ్రంథిం పూజయామి,

చంద్రసోదర్యైనమః – అష్టమగ్రంథిం పూజయామి,

శ్రీ వరలక్ష్మీయై నమః – నవమగ్రంథిం పూజయామి.

## శ్రీ మహాలక్ష్మి అష్టకం

**నమస్తేస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే |**

**శంఖచక్ర గదాహస్తే మహాలక్ష్మి నమోస్తు తే || 1 ||**

**నమస్తే గరుడారూఢే కోలాసుర భయంకరి |**

**సర్వపాపహరే దేవి మహాలక్ష్మి నమోస్తు తే || 2 ||**

**సర్వజ్ఞే సర్వవరదే సర్వ దుష్ట భయంకరి |**

**సర్వదుఃఖ హరే దేవి మహాలక్ష్మి నమోస్తు తే || 3 ||**

సిద్ధి బుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని |

మంత్ర మూర్తే సదా దేవి మహాలక్ష్మి నమోస్తు తే || 4 ||

ఆద్యంత రహితే దేవి ఆదిశక్తి మహేశ్వరి |

యోగజ్ఞే యోగ సంభూతే మహాలక్ష్మి నమోస్తు తే || 5 ||

స్థూల సూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే |

మహా పాప హరే దేవి మహాలక్ష్మి నమోస్తు తే || 6 ||

పద్మాసన స్థితే దేవి పరబ్రహ్మ స్వరూపిణి |

పరమేశి జగన్మాతః మహాలక్ష్మి నమోస్తు తే || 7 ||

శ్వేతాంబరధరే దేవి నానాలంకార భూషితే |

జగస్థితే జగన్మాతః మహాలక్ష్మి నమోస్తు తే || 8 ||

మహాలక్ష్మష్టకం స్తోత్రం యః పఠేద్ భక్తిమాన్ నరః |

సర్వ సిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా ||

ఏకకాలే పఠేన్నిత్యం మహాపాప వినాశనమ్ |

ద్వికాల్ం యః పఠేన్నిత్యం ధన ధాన్య సమన్వితః ||

త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రు వినాశనమ్ |

మహాలక్ష్మి ర్భవేన్-నిత్యం ప్రసన్నా వరదా శుభా ||

ఇంత్యకృత శ్రీ మహాలక్ష్మ్యష్టక స్తోత్రం సంపూర్ణమ్

## అష్టలక్ష్మి స్తోత్రము

సుమనసవందిత సుందరి మాధవి చంద్ర సహోదరి హేమమయే |

మునిగణవందిత మోక్షప్రదాయని మంజుల భాషిణి వేదనుతే |

పంకజవాసిని దేవ సుపూజిత సద్గుణ వర్షిణి శాంతియుతే |

జయ జయహే మధుసూదన కామిని ఆదిలక్ష్మి జయపాలయమాం || 1 ||

అయికలి కల్మష నాశిని కామిని వైదిక రూపిణి వేదమయే |

క్షీరసముద్భవ మంగళ రూపిణి మంత్రనివాసిని మంత్రనుతే |

మంగళదాయిని అంబుజవాసిని దేవగణాశ్రిత పాదయుగే |

జయ జయహే మధుసూదన కామిని ధాన్యలక్ష్మి జయపాలయమాం || 2 ||

జయవరవర్ణిని వైష్ణవి భార్గవి మంత్ర స్వరూపిణి మంత్రమయే |

సురగణ పూజిత శీఘ్రఫలప్రద జ్ఞానవికాసిని శాస్త్రనుతే |

భవభయహారిణి పాపవిమోచని సాధు జనాశ్రిత పాదయుగే |

జయ జయహే మధుసూదన కామిని ధైర్యలక్ష్మి జయపాలయమాం || 3 ||

జయ జయ దుర్గతి నాశిని కామిని సర్వఫలప్రద శాస్త్రమయే |

రథగజ తురగపదాది సమావృత పరిజన మండిత లోకనుతే |

హరిహర బ్రహ్మసుపూజిత సేవిత తాపనివారిత పాదయుగే |

జయ జయహే మధుసూదన కామిని గజలక్ష్మి జయపాలయమాం || 4 ||

అయిఖగవాహిని మోహిని చక్రిణి రాగవివర్ధిని జ్ఞానమయే |

గుణగణవారిధి లోకహితైషిణి సప్తస్వర నుత గానమతే |

సకలసురాసుర దేవమునీశ్వర మానస వందిత పాదయుతే |

జయ జయహే మధుసూదన కామిని సంతానలక్ష్మి జయపాలయమాం || 5 ||

జయకమలాసని సద్గతి దాయిని జ్ఞానవికాసిని గానమయే |

అనుదిన మర్ధిత కుంకుమ ధూసర వాసిత వాద్య నుతే |

వసుధారాస్తుతి వైభవ వందిత శంకర దేశిక మాన్య పదే |

జయ జయహే మధుసూదన కామిని విజయలక్ష్మి జయపాలయమాం || 6 ||

ప్రణతసురేశ్వరి భారతి భార్గవి శోకవినాశిని రత్నమయే |

మణిమయ భూషిత కర్ణ విభూషణ శాంతి సమావృత హాసముఖే |

నవనిధి దాయిని కలిమలహారిణి కామితఫలప్రద హస్తయుతే |

జయ జయహే మధుసూదన కామిని విద్యాలక్ష్మి జయపాలయమాం || 7 ||

ధిమిధిమి దింధిమి దింధిమి దింధిమి దుందుభి నాద సుపూర్ణమయే |

ఘుమఘుమ ఘుంఘుమ ఘుంఘుమ ఘుంఘుమ శంఖనాద సువాద్యనుతే |

వేదపురాణేతిహాస సుపూజిత వైదికమార్గ ప్రదర్శయుతే |

జయ జయహే మధుసూదన కామిని ధనలక్ష్మి జయపాలయమాం || 8 ||

## అష్టలక్ష్మి స్తోత్రము సంపూర్ణమ్

### ఈ కింది శ్లోకాలు చదువుతూ తోరం కట్టుకోవాలి

బద్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం

పుత్రపౌత్రాభివృద్ధించ మమ సౌభాగ్యం దేహిమే రమే

## వ్రత కథ

సూత మహాముని శౌనకుడు మొదలైన మహర్షులని చూసి యిలా అన్నాడు. 'ఓ మునీశ్వరు లారా! స్త్రీలకు సర్వ సౌభాగ్యములు కలుగు వ్రతమొకటి పూర్వము శివుడు పార్వతికి చెప్పాడు. దానిని చెప్తాను వినండి'. ఒక రోజు కైలాస పర్వతమున శివుడు తన సింహాసనము మీద కూర్చుని ఉండగా, పార్వతీదేవి ఆయనని సమీపించి, 'దేవా! లోకంలో స్త్రీలు ఏ వ్రతం చేస్తే సర్వసౌభాగ్యములను, పుత్రపౌత్రాదులను కలిగి సుఖసంతోషాలతో ఉంటారో అటువంటి వ్రతమేదో సెలవీయండి' అని అడుగగా పరమేశ్వరుడిలా చెప్పాడు. 'ఓ దేవీ! స్త్రీలకు పుత్ర పౌత్రాది సంపత్తులనిచ్చే వ్రతం ఒకటి ఉంది. దాని పేరు వరలక్ష్మీ వ్రతం. ఆ వ్రతమును శ్రావణమాసంలో శుక్లపక్ష పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారము రోజు చేయవలెను'. పార్వతీదేవి ' నాథా! ఆ వరలక్ష్మీ వ్రతము ఎలా చేయాలి , ఏ దేవతను పూజించాలి? ఏ విధంగా చేయాలి? దీనినెవరైనా యింతకు ముందు చేసారా? ఆ వివరములన్నీ చెప్పండి' అని అడుగగా శివుడు పార్వతీదేవిని చూసి, ఓ కాత్యాయనీ! వరలక్ష్మీ వ్రత విశేషాలు చెప్తాను విను.

పూర్వము మగధ దేశమున కుండినమనే ఒక పట్టణం ఉంది. ఆ పట్టణము నిండా బంగారు ప్రాకారములు, బంగారు గోడలు గల ఇళ్ళు ఉన్నాయి. అందులో చారుమతి అనే ఒక బ్రాహ్మణ స్త్రీ ఉన్నది. ఆమె పతియే ప్రత్యక్ష దైవముగా భావించి, తెల్లవారు ఝామునే లేచి, స్నానం చేసి, పతిదేవుని పూవులతో కొలిచి ఆ తర్వాత అత్తమామలకు అవసరమైన అనేక సేవలు చేసి, యింటి పనులన్నీ ఓర్పుతో, నేర్పుతో చేసుకుంటుండేది. అందరితో ప్రియంగా, మితంగా మాట్లాడుతుండేది. గయ్యాళిగా కాకుండా , ఇంత అణకువగా నున్న ఆ మహా పతివ్రతను చూసి మహాలక్ష్మికి ఆమె మీద అనుగ్రహం కలిగింది.

ఒకరోజు ఆ మాహాయిల్లాలికి కలలో ప్రత్యక్షమై మహాలక్ష్మి ఇలా చెప్పింది. 'ఓ చారుమతీ! నేను వరలక్ష్మీ దేవిని. నీ నడవడిక చూసి, నాకు నీ మీద అనుగ్రహం కలిగి నీకు ప్రత్యక్షమయ్యాను. శ్రావణమాసంలో శుక్ల పక్ష పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం రోజు నువ్వు నన్ను పూజించితే నీకు కోరిన వరములిస్తాను'

అలా ప్రత్యక్షమైన అమ్మ వారిని చూసి ఎంతో మురిసిపోయిన చారుమతీ దేవి కలలోనే వరలక్ష్మీ దేవికి ప్రదక్షిణ , నమస్కారములు చేసి ;

నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్య మూర్తయేశరణ్యే త్రిజగ ద్వంద్యే విష్ణు వక్షస్థలాలయే అని అనేక విధములు స్తోత్రం చేసింది.

'ఓ జగజ్జననీ! నీ కటాక్షంబు కలిగితే జనులు ధన్యులవుతారు. విద్వాంసులవుతారు. సకల సంపన్నులవుతారు. నేను పూర్వ జన్మలలో చేసిన పూజఫలం వల్ల నీ దర్శనము నాకు కలిగింది'. అనగా వరలక్ష్మీ దేవి సంతోషము చెందింది.

ఆ వెంటనే మెలకువ వచ్చి నాలుగు వైపులా చూస్తే చారుమతికి వరలక్ష్మీ దేవి కనబడ లేదు. అప్పుడామెకు అర్థమైంది తాను కలగన్నానని. వెంటనే భర్తనీ, అత్తమామలని లేపి చెప్పగానే వాళ్ళు కూడా చాలా సంతోషించారు. 'ఈ స్వప్నము చాలా ఉత్తమమైనది. దేవి ఆనతి ప్రకారం నువ్వు తప్పకుండా ఆ వ్రతం చెయ్యి' అన్నారు. చారుమతి తన యిరుగు పొరుగున ఉన్న స్త్రీలకు కూడా చెప్పింది. వాళ్ళు , చారుమతి ఎంతో ఉత్కంఠతో శ్రావణ మాసం ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడసాగారు.

వారు ఎంతో ఎదురు చూసిన పౌర్ణమి ముందు శుక్రవారము రానే వచ్చింది. ఈ రోజే కదా వరలక్ష్మీ దేవి చెప్పిన రోజని ఎంతో ఉత్సాహంతో చారుమతి మొదలగు స్త్రీలందరూ పూజకుపక్రమించారు. ప్రాతః కాలమే లేచి తలారా స్నానం చేసి, పట్టు బట్టలను కట్టుకున్నారు. చారుమతి యింట్లో అందరూ చేరారు. అక్కడ ఒక ప్రదేశంలో గోమయముతో అలికారు. ఒక మంటపం ఏర్పరిచారు. దాని మీద ఒక ఆసనం వేసారు. ఆసనం పైన కొత్త బియ్యము పోసి , మర్రిచిగుళ్ళు, మామిడాకుల అలంకారలతో కలశం ఏర్పరిచారు. అందులోకి వరలక్ష్మీ దేవిని అవాహనము చేసారు.

చారుమతి మొదలగు స్త్రీలంతా ఎంతో భక్తి శ్రద్ధలతో పూజ చేసారు.

పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితేనారాయణ ప్రియే దేవీ సుప్రీతా భవసర్వదా

అను ఈ శ్లోకంతో ధ్యానావాహనాది షోడశోపచార పూజ చేసారు.

తొమ్మిది సూత్రములు గల తోరాన్ని కుడి చేతికి కట్టుకున్నారు. వరలక్ష్మీ దేవికి అనేక రకములైన పిండి వంటలు చేసి నైవేద్యం పెట్టారు.దాని తర్వాత ప్రదక్షిణం చేస్తుండగా ఆ స్త్రీలందరికీ ఘల్లుఘల్లు మని శబ్ధం వినపడింది. వెంటనే తమ కాళ్ళను చూసుకుంటే గజ్జెలు మొదలైన ఆభరణములు కనిపించాయి. చారుమతి మొదలైన స్త్రీలంతా వరలక్ష్మీ దేవి కృపా కటాక్షములు కలిగాయని ఎంతో మురిసి పోయారు. రెండో ప్రదక్షిణం చేయగానే చేతులకు ధగధగ లాడే నవరత్నాలతో కూడిన కంకణములు మొదలైన ఆభరణములు కనిపించాయి. ఇంక వాళ్ల ఆనందం ప్రత్యేకించి చెప్పేదేముంది? మూడవ ప్రదక్షిణం పూర్తి కాగానే అ స్త్రీలంతా సర్వభూషణాలంకృతులయ్యారు. చారుమతి మొదలైన ఆ స్త్రీల యిళ్ళన్నీస్వర్ణమయాలయ్యాయి.వాళ్ళకి రథగజ తురగ వాహనాలు ప్రసాదింపబడ్డాయి.

చారుమతి యింటి నుంచి ఆ స్త్రీలను తీసుకుని పోవడానికి వారి వారి యిళ్ళ నుంచి గుర్రాలు, ఏనుగులు, రథాలు, బండ్లు వచ్చాయి. ఆ స్త్రీలు, చారుమతి కలిసి వారి చేత శాస్త్ర ప్రకారం పూజ చేయించిన బ్రాహ్మణోత్తమునికి గంధం, పుష్పం, అక్షింతలతో పూజించి 12 కుడుములు వాయనమిచ్చి , దక్షిణ తాంబూలములిచ్చి నమస్కరించారు. బ్రాహ్మణుడు వారిని ఆశీర్వదించారు. వరలక్ష్మీ దేవికి నైవేద్యం గా పెట్టిన పిండివంటలను బంధుమిత్రులతో తిని తమ కోసం వచ్చిన గుర్రాలు, ఏనుగులు మొదలైన వాహనాలలోవారి యిండ్లకు బయలు దేరారు.

వారు త్రోవలో చారిమతి భాగ్యమును, తమ భాగ్యమును ముచ్చటించుకుంటూ వెళ్ళారు. లక్ష్మీదేవి తనంతట తానే స్వప్నములో వచ్చి ప్రత్యక్షమవట మంటే మాటలా? చారుమతి ఎంత అదృష్టవంతురాలు అనుకున్నారు.

చారుమతికి ప్రత్యక్షమైన విధానం తన మటుకే దాచుకుని తను ఒక్కతే పూజించకూండా, తమ అందరికీ చెప్పి, తమకి కూడా ఇంతటి సౌభాగ్యం కలగజేసిన చారుమతి ఎంతటి పుణ్యురాలు, అలాంటి ఆమె పరిచయం కలిగి ఉండిన తామెంత భాగ్యవంతులు అని ఎంతో మురుసిపోయారు.

అప్పటి నుంచీ చారుమతితో సహా వారందరూ క్రమం తప్పకుండా ప్రతీ సంవత్సరం ఈ పూజ చేస్తూ పుత్రపౌత్రాభి వృద్ధి కలిగి, ధన కనక వస్తు వాహనములు కలిగి, సుఖ సంతోషాలతో ఉన్నారు. కావున 'ఓ పార్వతీ! ఈ ఉత్తమమైన వ్రతమును చేస్తే, అలా ఎదుటి వారికి చెప్పి చేయిస్తే సర్వసౌభాగ్యములు కలిగి శుభముగా ఉంటారు. ఈ కథను విన్నవారికి, చదివిన వారికి కూడా వరలక్ష్మీ ప్రసాదము వలన సకల కార్యములూ సిద్ధించును' అన్నాడు పరమశివుడు.

సూత మహాముని శౌనకుడు మొదలగు వారితో 'మునులారా! విన్నారుగా చారుమతి ఎదుటివారి మంచి కూడా ఎలా కోరిందో! ఎదుటి మనిషికి మంచి కలగాలని కోరుకుంటే అమ్మవారు యింకా ప్రసన్నురాలై మీరు కోరకుండానే మీకు మంచి చేస్తుంది' అన్నారు.

కథా అక్షింతలు అమ్మవారి మీద వేసి, మీ మీద వేసుకుని, మిగతా వారి మీద కూడా వేయండి.

**వరలక్ష్మీ దేవి వ్రతం సమాప్తం**

## కనక ధారా స్తోత్రమ్

వందే వందారు మందారమిందిరానంద కందలం

అమందానంద సందోహ బంధురం సింధురాననమ్

అంగం హరేః పులకభూషణమాశ్రయంతీ

భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్ |

అంగీకృతాఖిల విభూతిరపాంగలీలా

మాంగల్యదాస్తు మమ మంగళదేవతాయాః || 1 ||

ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః

ప్రేమత్రపాప్రణిహితాని గతాగతాని |

మాలాదృశోర్మధుకరీవ మహోత్పలే యా

సా మే శ్రియం దిశతు సాగర సంభవా యాః || 2 ||

ఆమీలితాక్షమధిగ్యమ ముదా ముకుందమ్

ఆనందకందమనిమేషమనంగ తంత్రం |

ఆకేకరస్థితకనీనికపక్ష్మనేత్రం

భూత్యై భవన్మమ భుజంగ శయాంగనా యాః || 3 ||

బాహ్వంతరే మధుజితః శ్రితకౌస్తుభే యా

హారావళీవ హరినీలమయీ విభాతి |

కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా

కళ్యాణమావహతు మే కమలాలయా యాః || 4 ||

కాలాంబుదాళి లలితోరసి కైటభారేః

ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ |

మాతుస్సమస్తజగతాం మహనీయమూర్తిః

భద్రాణి మే దిశతు భార్గవనందనా యాః ‖ 5 ‖

ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్

మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన |

మయ్యాపతేత్తదిహ మంథరమీక్షణార్థం

మందాలసం చ మకరాలయ కన్యకా యాః ‖ 6 ‖

విశ్వామరేంద్ర పద విభ్రమ దానదక్షమ్

ఆనందహేతురధికం మురవిద్విషోఽపి |

ఈషన్నిషీదతు మయి క్షణమీక్షణార్థం

ఇందీవరోదర సహోదరమిందిరా యాః ‖ 7 ‖

ఇష్టా విశిష్టమతయోపి యయా దయార్ద్ర

దృష్ట్యా త్రివిష్టపపదం సులభం లభంతే |

దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్తిరిష్టాం

పుష్టిం కృషీష్ట మమ పుష్కర విష్టరా యాః ॥ 8 ॥

దద్యాద్దయాను పవనో ద్రవిణాంబుధారాం

అస్మిన్నకించన విహంగ శిశౌ విషణ్ణే ।

దుష్కర్మఘర్మమపనీయ చిరాయ దూరం

నారాయణ ప్రణయినీ నయనాంబువాహః ॥ 9 ॥

గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి

శాకంబరీతి శశిశేఖర వల్లభేతి ।

సృష్టి స్థితి ప్రళయ కేళిషు సంస్థితాయై

తస్యై నమస్త్రిభువనైక గురోస్తరుణ్యై ॥ 10 ॥

శ్రుత్యై నమోఽస్తు శుభకర్మ ఫలప్రసూత్యై

రత్యై నమోఽస్తు రమణీయ గుణార్ణవాయై ।

శక్త్యై నమోఽస్తు శతపత్ర నికేతనాయై

పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమ వల్లభాయై ॥ 11 ॥

నమోఽస్తు నాళీక నిభాననాయై

నమోఽస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై ।

నమోఽస్తు సోమామృత సోదరాయై

నమోఽస్తు నారాయణ వల్లభాయై ॥ 12 ॥

నమోఽస్తు హేమాంబుజ పీఠికాయై

నమోఽస్తు భూమండల నాయికాయై ।

నమోఽస్తు దేవాది దయాపరాయై

నమోఽస్తు శారంగాయుధ వల్లభాయై ॥ 13 ॥

నమోఽస్తు దేవ్యై భృగునందనాయై

నమోఽస్తు విష్ణోరురసి స్థితాయై ।

నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై

నమోఽస్తు దామోదర వల్లభాయై ॥ 14 ॥

నమోఽస్తు కాంత్యై కమలేక్షణాయై

నమోఽస్తు భూత్యై భువనప్రసూత్యై ।

నమోఽస్తు దేవాదిభిరర్చితాయై

నమోఽస్తు నందాత్మజ వల్లభాయై ॥ 15 ॥

సంపత్కరాణి సకలేంద్రియ నందనాని

సామ్రాజ్య దానవిభవాని సరోరుహాక్షి ।

త్వద్వందనాని దురితా హరణోద్యతాని

మామేవ మాతరనిశం కలయంతు మాన్యే ॥ 16 ॥

యత్కటాక్ష సముపాసనా విధిః

సేవకస్య సకలార్థ సంపదః ।

సంతనోతి వచనాంగ మానసైః

త్వాం మురారిహృదయేశ్వరీం భజే ॥ 17 ॥

సరసిజనిలయే సరోజహస్తే

ధవళతమాంశుక గంధమాల్యశోభే ।

భగవతి హరివల్లభే మనోజ్ఞే

త్రిభువనభూతికరీ ప్రసీదమహ్యం ॥ 18 ॥

దిగ్ఘస్తిభిః కనక కుంభముఖావసృష్ట

స్వర్వాహినీ విమలచారుజలాప్లుతాంగీమ్ |

ప్రాతర్నమామి జగతాం జననీమశేష

లోకధినాథ గృహిణీమమృతాబ్ధిపుత్రీం || 19 ||

కమలే కమలాక్ష వల్లభే త్వం

కరుణాపూర తరంగితైరపాంగైః |

అవలోకయ మామకించనానాం

ప్రథమం పాత్రమకృతిమం దయాయాః || 20 ||

దేవి ప్రసీద జగదీశ్వరి లోకమాతః

కళ్యాణగాత్రి కమలేక్షణ జీవనాథే |

దారిద్ర్యభీతిహృదయం శరణాగతం మాం

ఆలోకయ ప్రతిదినం సదయైరపాంగైః || 21 ||

స్తువంతి యే స్తుతిభిరమీభిరన్వహం

త్రయీమయీం త్రిభువనమాతరం రమాం |

గుణాధికా గురుతుర భాగ్య భాగినః

భవంతి తే భువి బుధ భావితాశయాః ॥ 22 ॥

సువర్ణధారా స్తోత్రం యచ్ఛంకరాచార్య నిర్మితం

త్రిసంధ్యం యః పఠేన్నిత్యం స కుబేరసమో భవేత్ ॥

## పాట: వరలక్ష్మి వచ్చింది మీ ఇంటికి.

## రాగం: శ్రీ రాగం.

వరలక్ష్మి వందనము.

పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే

నారాయణ ప్రియై దేవీ సుప్రీతా భవ సర్వదా.

పల్లవి.

వరలక్ష్మి వచ్చింది మీ ఇంటికి,

సిరులలో ముంచి, శ్రేయ మందించ. ॥వర॥

అనుపల్లవి.

కలికి వచ్చె మీ కోర్కెలు తీర్చ,

వెల లేని సౌభాగ్య సంతసము లీయ. ॥వర॥

ఎద లోతులున్న ఆశలు తీర్చ,

మాధవి మీకు ముదము చేకూర్చ,

వ్యధలన్నీ బాపి వరము లందించ,

ఐదవ తనపు నిధిని సమకూర్చ. ॥వర॥

శ్రావణమాస శుక్రవారము నందు,

శ్రీవిష్ణు పత్ని, శ్రీ మహాలక్ష్మి,

శ్రవణ నక్షత్ర శుభ ఘడియ లందు,

నవరత్న సంపదలు యివ్వ వచ్చింది. ॥వర॥

ఆనంద, ఐస్వర్య, జ్ఞాన స్వరూపిణి,

అన్నమయ్య నుత నిత్యానపాయిని,

కనికారము జూపు కనక విలోచన,

ఒనరంగ మీ ఇంట నెలవుండ వచ్చింది, ॥వర॥

ఇంపుగ ఇల్లు శుభ్రముగ నుంచి,

సొంపుగ శ్రీదేవి ప్రతిమను చేసి,

ఒంపుగ వనితలు వరలక్ష్మిని కొల్వ,

నింపు సంపదలు శ్రీలక్ష్మి మీ ఇంట.  ||వర||

అష్టలక్ష్మిని మీరు నిష్టగ కొలిచి,

ఇష్టమగు రీతిలో ఇందిరను సేవించి,

స్పష్టముగ  మీ కోర్కె సుదతికి తెల్ప,

కష్టములు కడతేర్చి కలిమి కమలిచ్చు.  ||వర||

## ప్రార్థన

నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సుర పూజితే

శంఖచక్ర గదా హస్తే మహాలక్ష్మీ నమోస్తుతే

తాత్పర్యం :

మహామాయారూపిణి, శ్రీపీఠవాసిని, దేవతలు నిరంతరం సేవించే లోకమాత, శంఖ, చక్ర, గదల్ని ధరించిన మహాలక్ష్మీ దేవి అష్టైశ్వర ప్రదాయిని. అష్ట సంపదల్ని అందించే జగన్మంగళ దాయిని. అష్టైశ్వరాల్నీ కలగజేసే అష్టలక్ష్మి రూపాన్నే వరలక్ష్మీ దేవిగా మనం ఆరాధిస్తాం. భక్తితో పూజించినవారికీ, కొలిచినవారికీ కొంగుబంగారమై వరాలనిచ్చే మహాలక్ష్మే వరలక్ష్మి.

## ఎందుకు ఈ వ్రతం ఆచరించాలి?

భారతీయ ఆధ్యాత్మికాచారాలలో పండుగలకున్న ప్రాధాన్యత ప్రత్యేకమైనది. పండుగను అభిమానించని భారతీయుడు ఉండడు. ప్రత్యేకంగా పండుగను చేసుకోని నాస్తికులు సైతం పండుగ దినాలను మాత్రం ఖచ్చితంగా సంతోషంగా అనుభవించే తీరతారు. అది పూజతో నిమిత్తం లేనిది. సంతోష ఉత్సాహాలకు నిలయమైనది. కాబట్టే పండుగ అనే భావన ఎటువంటివారిలోనైనా అలౌకికానందాన్ని పంచుతుంది. ఒక్కో పండుగ ఒక్కో ప్రత్యేకమైన శోభను చేకూరుస్తూ మానసికోల్లాసాన్నిస్తూ గృహాలకు కొత్త అందాలను ఇస్తుంది. అందుకే చిన్నా, పెద్దా అందరూ వీటికోసం ఎంతో ఆర్తిగా ఎదురుచూస్తుంటారు. పండుగల సంబరాలు చిన్న పిల్లలవే అయినప్పటికీ ఆ ముచ్చట్లను పెద్ద్లలు కూడా ఎంతో సంతోషంగా అనుభవిస్తారు.

శ్రావణమాసం శుక్లపక్షంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారాన్ని వరలక్ష్మీ వ్రతంగా జరుపుకోవడం ఒక హిందూ ఆచారం.

అష్టలక్ష్ముల్లో వరలక్ష్మీదేవికి ఓ ప్రత్యేకత ఉందంటారు. మిగిలిన లక్ష్మీ పూజలకంటే వరలక్ష్మీ పూజ శ్రేష్ఠమని శాస్త్ర వచనం. శ్రీహరికి ఇష్టమైన, పైగా విష్ణువు జన్మనక్షత్రమైన శ్రవణం పేరిట వచ్చే శ్రావణ మాసంలో ఈ వ్రతాన్ని చేస్తే విశేష ఫలితాలు లభిస్తాయంటారు. సర్వమంగళ సంప్రాప్తి కోసం, సకలాభీష్టాలకోసం, నిత్య సుమంగళిగా తాము వర్ధిల్లాలని పుణ్యస్త్రీలు ఈ వ్రతం చేస్తారు. దక్షిణ భారతదేశంలో ఈ వరలక్ష్మీ వ్రతాన్ని వివిధ సంప్రదాయాల్లో ఆచరిస్తారు. ఎవరు ఏ పద్ధతులు పాటించినా శ్రీ లక్ష్మిని కొలిచే తీరు మాత్రం అందరిదీ ఒక్కటే! సకల శుభంకరమైన, సన్మంగళదాయకమైన వరలక్ష్మీదేవి పూజ జగదానందకరమైనదని భక్తులందరి ప్రగాఢ విశ్వాసం.

### వైద్య రహస్యాలు

శ్రావణం వర్షాకాలమైన కారణం గాను , రాబోయే భాద్రపదమాసం కూడా వర్షాలతోనే ఉండే కారణం గానూ ..

పసుపుని పాదాలకి రాసుకుంటే జలుబు , రొంప మొదలైన వ్యాధులు రావు .మొలకెత్తిన శనగల్ని ఈ 2 నెలలు పాటు ప్రసాదము గా తినడం వల్ల శరీరానికి పోషక విలువలు గల ఆహారము అందివ్వడం వల్ల శరీర వ్యాధి నిరోధక శక్తి పటిష్టమవుతుంది .

ప్రతి స్త్రీ కూడా బొట్టు , కాటుక , గందము ,మట్టెలు . పూలు , పట్టుచీర నగలు తో నిండుగా ఉండడం వల్ల సూక్ష్మ జీవులు దరికి రావు .

తాంబూలము వేసుకోవడం వల్ల జీర్ణక్రియ సులభతరమవుతుంది .

చిత్ర దీపం పేరిట (బెల్లము , వరిపిండిని ముద్దగా చేసి కుందెగా మలిచి , దాంట్లో ఆవునేతితో దీపాన్ని వెలిగించి ఆ దీపం కొండెక్కిన తర్వాత ) పెట్టిన దీపం తినడం వల్ల దానికున్న ఔషద గుణాల కారణం గా వర్షాకాలము లో దాగి యున్న ఏ వ్యాధి స్త్రీల దరికి చేరదు .

స్త్రీల తో కూడా పురుషులు ఈ ప్రసాదాదులు ఆరగించడం వల్ల మగవారికి ఈ లాభాలు అందుబాటులో ఉంటాయి .

పండుగ చేసి ఇరుగు పొరుగు వారితోను , బంధుమిత్రులతోను కలిమి – చెలిమి సంబంధాలు – కుటుంభ వ్యవస్థను పటిస్ఠ పరచి మానసిక ఉల్లాసాన్ని , ఉత్సాహాన్ని కలిగిస్తాయి కాబట్టి మానసిక రుగ్మతలకు దూరముగా ఉండవచ్చును .

## సమాజ ప్రయోజనాలు :

మన సంప్రదాయాల్లో పూజలూ.. వ్రతాల వెనుక శాస్త్రీయమైన కారణాలనేకం. అన్నీ ఆలోచించి.. ఏయే కాలాల్లో ఏమేం చేస్తే ఇల్లు.. ఊరు.. సమాజం ఆరోగ్యంగా ఉంటాయో .... ఆనాడు పెద్దలు ఆలోచించి ప్రవేశపెట్టినవే ఇవన్నీ. పుణ్యం మాట పక్కనబెడితే.. మనం చేసే కొన్ని పనుల వల్ల శారీరకంగా.. మానసికంగానూ.. ఎంతో దృఢంగా.. ఆరోగ్యంగా ఉండాలన్నదే వీటి ఉద్దేశం.

ఉత్తరాయణం, దక్షినాయణానికి మధ్యస్థంగా శ్రావణ మాసం వస్తుంది. ఇది వర్షాకాలం. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. అన్ని పంటలూ పండే కాలం. వర్షాలకు గ్రామాల్లోని చెత్తాచెదారం కొట్టుకుపోయి

సమీపంలోని చెరువుల్లో చేరతాయి. సారవంతమైన మట్టి పొలాలకు చేరుతుంది. బావులు, చెరువులు నీటితో నిండుతాయి. పశువులకు కావాల్సిన గ్రాసం దొరుకుతుంది. అందరికీ చేతినిండా పనులు.. తద్వారా సొమ్ములు. అందుకే సకల సంపదలను కలిగిస్తుందని

శ్రావణమాసంలో రెండో శుక్రవారం వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరిస్తూ వస్తున్నారు. సర్వ సౌభాగ్యాలను కలగజేస్తుందని మహిళలు ఈ పూజను విధిగా చేస్తారు. ఇళ్లు వాకిళ్లను శుభ్రం చేసుకుని.. తోరణాలతో అలంకరించి పూజలు చేస్తారు. వరలక్ష్మీ వ్రతం సకల శుభాలను కలగజేయడమే కాకుండా శాస్త్రీయంగా ఇంటికి, వంటికి, సమాజానికి కూడా ఎంతో ఉపయోగపడుతుంది. అందుకే వరలక్ష్మీ పూజ ఆరోగ్య ప్రదమని వివరించారు.

ఎన్నో ఉపయోగాలు

వరలక్ష్మీ వ్రతానికి తొమ్మిది రకాల పుష్పాలు, పిండివంటలు, పత్రి, పండ్లను ఉపయోగిస్తారు. వీటివల్ల ఎన్నో ఉపయోగాలు. వరలక్ష్మీ దేవిని ఆరాధించడానికి, నైవేద్యం పెట్టడానికి ఉపయోగించే సామగ్రి, వంటల్లో ఆరోగ్య రహస్యాలు ఉన్నాయి.

- వరలక్ష్మీ నైవేద్యానికి పూర్ణం బూరెలు, పులగం, గారెలు, పరమాన్నం, చక్కెరపొంగలి, పులిహోర, పెసరబూరెలు, గోధుమ ప్రసాదం తయారు చేస్తారు. వీటికోసం బియ్యం, పెసరపప్పు, పంచదార, జీలకర్ర, మినపప్పు, పాలు, నెయ్యి, జీడిపప్పు, కిస్‌మిస్, వేరుశనగపప్పు, మజ్జిగ, గోధుమనూక వంటివి వినియోగిస్తారు. దీనినే ప్రసాదంగా భుజిస్తారు. వీటిలో ప్రొటీన్లు, విటమిన్లు, ఇతర పోషకాలు ఉంటాయి. శరీరానికి ఎంతో ఉపకరిస్తాయి. ఇటువంటి ఆహారం తరుచూ తీసుకుంటే అనారోగ్యం దరి చేరదని పెద్దలు చెబుతున్నారు.

- పూజకు ఉపయోగించే పత్రి ఇంటి పరిసరాలకే కాకుండా శరీరానికి కూడా ఉపకరిస్తాయి. ఉసిరిక, మారేడు, నేరేడు, జమ్మి, దుచ్చిన, రావి, వెలగ, మారేడు, అత్తి, జాజి వంటివి పూజకు ఉపయోగిస్తారు. వీటిని వల్ల గాస్టిక్ సంబంధ ఇబ్బందులు, మహిళలకు రుతుసంబంధ సమస్యలు, చర్మసంబంధ

రోగాలు, దంత, నోరు, కంటి సమస్యలు తగ్గుతాయి. శ్వాస సంబంధ రోగాలు కూడా నయమవడానికి పత్రి ఎంతో ఉపయోగపడుతుంది.

- ఇక వరలక్ష్మి వ్రతం రోజే మొగలిపువ్వును వినియోగిస్తారు. ఇది పరిసరాలను చాలా ప్రభావితం చేస్తుంది. తొమ్మిది రకాల పుష్పాలతో పూజ చేస్తారు. వీటివల్ల వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. ఏకాగ్రతను పెంచుతుంది. మహిళల్లో ముఖవర్చస్సు పెంచుతుంది. తలలో పేలు రాకుండా పుష్పాలు ఉపకరిస్తాయి. తలపోటు, కళ్లనొప్పులు రాకుండా పువ్వులు కాపాడతాయి. అందుకే పూజలో ఉంచిన పువ్వులను మహిళలు స్వయంగా తలలో ఉంచుకుంటారు. పేరంటానికి వచ్చిన ఇరుగుపొరుగు వారికి పెడతారు.
- వరలక్ష్మీ వ్రతంలో ప్రధానంగా తొమ్మిది రకాల పండ్లను నైవేద్యంగా పెడతారు. వీటినే ప్రసాదంగా తీసుకుంటారు. పండ్ల వల్ల ఎన్ని ఉపయోగాలున్నాయో తెలిసినా.. వినియోగం తక్కువ. ఇలాంటి పూజల సందర్భాల్లోనైనా ఆహారంగా తీసుకుంటే శరీరానికి కావాల్సిన ప్రొటీన్లు, విటమిన్లు లభిస్తాయని పెద్దల ఉవాచ.
- బలమైన కండరాలు, దృఢమైన ఎముకలు, మెరిసే కళ్లు, ముడతల్లేని చర్మం, వంకర్లు లేని దేహం, నల్లటి శిరోజాలు, తెల్లని దంతాలు, చక్కని జీర్ణశక్తి, సమృద్ధిగా రక్తం, ఎత్తుకు తగిన బరువు, అంటు వ్యాధులను దరిచేరదీయని రోగ నిరోధక వ్యవస్థ ఉండాలంటే పోషక పదార్థాలను తీసుకోవాలి. ఇవి ఉండాలంటే పండ్ల ద్వారానే సాధ్యం. ప్రోటీన్లు, విటమిన్లు, నీరు, కాల్షియం వంటివి ఒక్కో పండు ద్వారా లభిస్తుంది. సంప్రదాయం పేరుతో వీటిని ఉపయోగించాలని పెద్దలు చెబుతున్నారు.
- మహిళలు పూజలో ఎంతోకొంత బంగారం పెడతారు. ఇది ఆర్థిక స్థోమతును బట్టి ఉంటుంది. ఇలాంటి సందర్భాల్లో కొనుగోలు చేయటం ద్వారా కొంత బంగారం సమకూర్చుకునే అవకాశం ఉంది.

**వరలక్ష్మీ కటాక్ష సిద్ధిరస్తు ...... సర్వేజనా సుఖినోభవంతు**

## సనాతన హిందూ సాంప్రదాయాలు గ్రూప్, ఛానల్ తరపున మేము ప్రతి రోజూ పోస్టు చేస్తున్న పోస్టుల సమగ్ర వివరాలు

1) పంచాంగం

2) రామాయణం

3) శ్రీ మద్భాగవతం

4) ద్వాదశ రాశుల వారి జాతక ఫలితాలు

5) మంచి మాటలు- సూక్తులు

6) నిత్య దేవతా స్తోత్రాలు

7) భగవద్గీత నీతి వాక్యాలు

8) పురాణ ప్రశ్నలు- సమాధానము

9) తెలుగు సుభాషితాలు

10) క్షేత్ర సందర్శనం

11) భగవద్గీత

12) హిందూ వైదిక ధర్మంలో ప్రఖ్యాత గాంచిన ఋషుల చరిత్ర

13) ధర్మ సందేహములు

14) నిత్యం పఠించవలసిన శ్లోకాలు

15) నిత్య సత్యాలు-ధర్మ ఆచారములు

16) పండుగలు వాటి విశిష్టత

17) భక్తి సమాచారం

## రాబోయే రోజుల్లో మేము పోస్టు చేయబోయే పోస్టుల వివరాలు

1) మహా భారతము

2) సుందరకాండ పారాయణము

3) శివ మహా పురాణము

4) జగద్గురు ఆది శంకరచార్య విరచిత సౌందర్య లహరి స్తోత్రములు-తాత్పర్యములు

5) విష్ణు సహస్రనాములో ఉన్న 1000 నామములు వాటి అర్థాలు

6) అరుణాచల వైభవం

7) కాంచీపుర వైభవం

8) గజేంద్ర మోక్షము

9) యక్ష ప్రశ్నలు

10) తిరుప్పావై

11) తిరుమల వేంకటేశ్వరుని సుప్రభాతం- తాత్పర్యములు

12) కార్తీక పురాణం

13) రామాయణంలో దాగి ఉన్న వివిధ సత్యాలు

14) భాగవతంలో నిక్షిప్తమై ఉన్న నీతి కథలు

15) ఇతరములు